శ్రీరస్తు

# శ్రీసద్గురువిలాసము.

—— :0: ——

ఇది




సుధీజనవిధేయుండగు

తాళ్లూరి. నారాయణకవిచే, రచియింపఁబడి,

మహారాజశ్రీ రాజువోలు. వేంకటాచలం పంతులవారిచే

ఒంగోలు.

బ్రహ్మశ్రీ ధారా. మార్కండేయశాస్త్రులవారి

పరమానందవిలాసినీ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడియె.

1895.



దీనివెల ౬ - అణాలు.

పత్రిక.

శ్రీ సచ్చిదానంద గురు పరబ్రహ్మణేనమః.

# శ్రీ సద్గురు విలాసము.

ఇది

అష్టాంగయోగోత్కృష్ట నిష్ఠాగరిష్ఠులగు తాళ్లూరి, కృష్ణామాత్యునిచేతను, తత్పుత్రుండును, శ్రీవత్స సగోత్రుండును, ఆపస్తంభ సూత్రుండును, సద్గురుచ్ఛాత్రుండును, భగవత్కథా పారాయణుండును నగు నారాయణ కవిచేతను రచియింపంబడి బ్రహ్మశ్రీ మైలవరము వేంకట శివార్య వర్యునిచే సరిచూడబడి వారి శిష్యుండును శ్రీమదనంతపురము తాలూకా మాల్యవంత గ్రామ నివాసులును ప్రస్తుతము దక్షిణమహారాష్ట్ర యినుపదారి చీఫ్ గార్డుగా నుండిన మహారాజశ్రీ రాజువోలు. వేంకటాచలంపంతులవారు, ధన వినియోగ పూర్వకముగాఁ బ్రేరేపింపఁ దదనుమతంబున ముద్రితమై ప్రచురింపఁబడియె.

☞ వలయువారలు దొనకొండ, రైలుస్టేషన్ పోస్టాఫీసు, ఆర్, వెంకటాచలంపంతులుగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.



# శ్రీ సద్గురువిలాసము.

——:():——

నాటరాగము ॥ ఆదితాళము.

శ్రీగురుంభజామి । సదామది ॥ శ్రీగురుం ॥ శ్రీగురువరుఁగొల్చినఁగరుణావతి । నాగమమంత్రర, హస్యముఁదెల్పును ॥ శ్రీ॥ సతతముముక్షువ్రత । వితతిఁబ్రేమించియతు । లితమతితోస । ద్గతినిచ్చునుబర ॥ శ్రీ ॥ మానుగనీవును । నేననియెటియభి । మానముడంచిను । జ్ఞానమొసఁగుపర ॥ శ్రీ ॥ అనయమునారా । యణదాసకృతా । ర్చనలకలరిదయఁ । గనువేంకటశివ ॥ శ్రీగురుంభజామి ॥

సౌరాష్ట్రరాగము ॥ త్రిపుటతాళము.

సోహమనికనరా ॥ సోహమనుచును గురుముఖంబున । సులభముగఁదెలిసిననుజాలదె । మోహవారిధిలోనఁబడియిటు । మునుఁగుచుండఁగనేలజీవుఁడ ॥ సోహమనికనరా ॥ కోరికలుచేకూరమూలా। ధారచక్రవిహారుఁడైతగు । వారణాననుఁజేరియతనికి । నారునూరులొసంగిజీవుఁడ ॥ సోహ ॥ పూనిలింగస్థానస్వాధి । ష్ఠానచక్రముపైనవాణీ । జానిగలఁడు బిరాననేగియు । వానికార్వేలొసఁగిజీవుఁడ ॥ సోహ ॥ సారెకుసుమణిపూరకంబను । చారుచక్రముపైననుండిన । శ్రీరమాధిపునకుసుభక్తిని । నారువేలర్పించిజీవుఁడ॥సోహ॥ పొందిహృదయమునందనాహత । మందుగిరిజాయుక్తుఁడైతగు । నిందుధరునకుషట్సహస్రము। లందముగనర్పించిజీవుఁడ ॥ సోహ ॥ పాదుకొనికంఠస్థలంబున । మోదమునసువిశుద్ధచక్రము । మీఁదవిహరించెటిజీవున । కాదరమునసహస్రమొసఁగియు ॥ సోహ ॥ పాయకనుభ్రూ

ద్రియములఁ। గదిసిశబ్దముల। నిర్ణయించివిను। నేర్పరి నెఱిఁగిన ॥నీవే॥ స్పర్శేంద్రియమున । స్పర్శము లైదువి । మర్శ చేయున । మ్మాన్య నెఱింగిన ॥ నీవే ॥ పదిరూపంబులు ॥ ముదమునఁగన్నులఁ । గదిసి కాంచునా । సదములు నెఱిఁగిన ॥ నీవే ॥ రసనేంద్రియమున । రయమున షడ్విధ । రసముల మెసవుప । రాత్పరు నెఱిఁగిన ॥ నీవే ॥ ప్రియమున గంధ । త్రయమును ఘ్రాణేం।ద్రియమునమూర్ఛను । తెలివి నెఱింగిన ॥ నీవే ॥ మఱియును మానస । మంతము నెఱిఁగిసు । స్థిరుఁడగు వేంకట । శివగురు నెఱిఁగిన ॥ నీవే ॥

మొదుకుల కాంభోజి రాగము ॥ అటతాళము.

తాను తానయ్యేవి । ధానముఁ దెలిసినఁ । దానె బ్రహ్మముసో రా । మేనుమనముమాన । మేననుమననము।మానిమానితసచ్చి।దానందమయుఁడగు ॥ తాను ॥ రజ్జువునందున । ర్పభ్రాంతిదోఁచిన । ట్లిజగద్భ్రమతోఁచి । ఒజ్జల చేదాని । యునికినిదెలిసియ । సజ్జడాత్మికమని । సాక్షియైనిలచిన ॥ తాను ॥ పాయకవిమలద । ర్పణమందుముఖప్రతి । చ్ఛాయతోఁచినరీతినీ । మాయావిద్యల చేత । మదికల్పితంబైన । ఆయీశజీవుల । మాయించిమిగిలిన ॥ తాను ॥ అరయఁ దాఘ్రాణినా । రాయణదాసహృ । త్సరసీరుహమునందున । గురుతరముగమైల । వరవు వేంకటశివ । గురురూపముగనుగో । చరమై వెల్గుచునున్న ॥ తాను ॥

దర్బారు రాగము ॥ అటతాళము.

ఇదివట్టిమాయ । దీనికేఁదుద । మొదలు లేదాయ ॥ అదియిది యనుచులే । నిదెకల్పితంబాయ ॥ నిది ॥ వైచిత్ర్యమాయ । నజ్ఞానమునఁ । దోఁచినదాయ । చూచినవారిధి । వీచులవిధమాయ ॥ నిది ॥ ఏమిలేదాయ । వృత్తరూప । నామములాయ । యామాసామాయ ।

యనుటనిశ్చయమాయె ॥ నిది ॥ అవ్యక్తమాయె । నందునపహద । హంకృతులాయె । సవ్యముగజగ । జ్జాలమందునవాయె ॥ నిది ॥ గురిలేకదాయె । వేంకటశివ । గురుడుదయచేయ । ధరనునారాయణ । దాసునంటనిదాయె ॥ నిది ॥

కాంభోజి రాగము ॥ ఆదితాళము.

గురుపదాబ్జములు । గొలిచినవారికి ॥ గోచరించునదియదేకదా । స్థిరముగదేహేంద్రియములవిడచిన । శేషించినదల్లదేకదా ॥ గురు ॥ సతతమ్మనుజ్ఞా । గ్రతవర్తనస । మ్మతితోఁగాంచేదదేకదా । అతులితస్వప్నము । నందలినడవడి । నారయుచుండేదదేకదా ॥ గురు ॥ సకలముసుషుప్తిని । సమసినతఱిఁగ । ష్పకనుండేదల్లదేకదా । ప్రకటితముగఁదు । ర్యమునఁబ్రణవరూ । పకమైవెల్గెడదేకదా ॥ గురు ॥ పొందుమీరనెం । దెందుఁజూడనం । దండేయున్నదియదేకదా । అందముగానుమ । హాత్ములుగనియా । నందించేదల్లదేకదా ॥ గురు ॥ వివరింపఁగమై । లవరపువేంకట । శివస్వరూపంబదేకదా । అవనిలోనవా । రాయణదాసున । కనుభవమైనదియదేకదా ॥ గురు ॥

మధ్యమావతి రాగము ॥ అటతాళము.

అమనస్కరాజయో । గముఁదెలియరాదు । హరిహరాదులకైన । నదియలవికాదు । అమ ॥ సులభముగనువారి । ధులనీదవచ్చు । జెలఁగిచుక్కలులెక్క । చేయఁగవచ్చు ॥ నమ ॥ ఇసుకపుప్పురిత్రాడు । వేయఁగవచ్చు । బొసఁగఁజినుకులనెన్నఁ బూనఁగవచ్చు ॥ నమ ॥ పులిమీసములనును । య్యాలలూగవచ్చు । బొలుపుగనాకాశ । మునుబ్రమింగవచ్చు ॥ నమ ॥ కాలినయినుముఁజక్కఁగద్రొక్కవచ్చు । లీలఁగొండలుగద । లింపఁగవచ్చు ॥ నమ ॥ ధరనునారాయణ । దాసురీతిగను । బరగ వేంకటశివ గురునిజేరకను ॥ నమ ॥

ఆనందభైరవి రాగము ॥ అటతాళము.

మనసునిల్పుటయెంతపనిరా ॥ యెంతపనిరా ॥ జీవ । తనం దానుగాంచినం । తనేనిలుచునురా ॥ మన ॥ నోటమాటవచ్చుకంటె । ఉప్పు । పాటువేయుటకంటె । బహుసులభమురా ॥ మన ॥ పూలుజేరుటకంటెందలంప । నావు । పాలుగ్రోలుటకంటె । బహుసులభమురా ॥ మన ॥ చిటుకవ్రేయునంతకంటే । వ్రేలి । మెటికవిరచుటకంటె । మెళుకువగదరా ॥ మన ॥ సరగనజ్ఞానముదొలగ । సైల । వరపువెంకటశివ । గురుకృపగలుగ ॥మన॥

ముఖారి రాగము ॥ అటతాళము.

గురుకటాక్షముగల్గుటాయను । దు । ర్గుణములన్నియు సమసిపోయెను । ఘోర । దురితజాలములెల్ల । దూరముందొలంగిపోయె ॥ గురు ॥ సచ్చిదానందమయునింగంటిని । సర్వ । సాక్షినైనేనేనిలిచియుంటిని । యికను । చచ్చిపుట్టుటలనేడు । జడుపెల్లందీరెమంటి ॥ గురు ॥ దేహాత్మబుద్ధియెల్లదొలగ్గెను । వి । దేహాకైవల్యమురాగల్గెను । సం । దేహములేకసకల । దృగ్రూపముగుచువెల్గు ॥ గురు ॥ కామాదిశత్రులజయించితి । విషయస్తోమములనుదలించితి । పరం । ధామునింజిత్తమందుం । దవిలికాంచంగంగల్గె ॥ గురు ॥ కోరిసంతతయోగాభ్యాసునీ । తా । ళ్లూరినారాయణాఖ్యదాసునీ । యఘుని । వారణజేసినసైల । వరపువెంకటశివ ॥ గురు ॥

ముఖారి రాగము ॥ అటతాళము.

శ్రీరమ్యముగనుదే, శికమూర్తిశ్రీపాద । సారసములు । గొల్వపె॰। కోరికలన్నిచే । కూరుదుష్కృతములు । దూరమువనెంచునేవోమనసా ॥ శ్రీ ॥ లోకవాసనలతో । లోలతనొందినీ । వేకారుచునుండకే । లోకాంతరాత్మని । నేకాలమునసీవా । లోకించిసుఖ

మొందవే । వోమనసా ॥ శ్రీ౯ ॥ మర్విషయంబుల । తోజతగూడు
క । మర్యాదములకేగకే । సార్వకాలమొకర్రి । సరణేనివెలుగొందు ।
సర్వమయునిఁజేరవేవోమనసా ॥ శ్రీ౯ । అవనిదాళ్లూరినా । రాయ
ణాభిదాన । కవిదెల్పినటువినవె । భవబంధభయములు । భాయును వేం
కట । శివగురుఁగనుఁగొనవె । వోమనసా ॥ శ్రీ౯ ॥

పంతువరాళి రాగము ॥ ఆదితాళము.

ఎందుకు బోర్లఁబడేవిఁక సంసృతి । పొందుచాలుఛీఛీ మన
సా । ముందుగసద్గురు । మూర్తిసమ్ముఖము । నందుఁజేరిశుభ । మొం
దరాదటె ॥ యెందు ॥ నీచశేవలను । నెలకొనిచేసియు । నేకధనము
నార్జించి । దాచిదాచియది । చూచిమురిసెదవు । గోచిమాత్రమును ।
గొంచపోవుకడ ॥ కెందు ॥ యుక్తవయసుగల । యువిదలనత్యా । స
క్తితోడఁగాంచీ । రక్తమాంసమూ । త్రపురీషవసా । యుక్తదేహ
మను । రక్తితోడఁగని ॥ యెందు ॥ కన్నసుతులనం । గనలబాంధవు
ల । నన్నదమ్ములనుజూచి । యన్నవాఁడనని । యుబ్బట్లూగెదు । తి
న్నఁగనినుఁగడ । తేర్పఁగలరెవీ ॥ రెందు ॥ వేదేటికివిను । వేంకట
శివగురు । రాయునిఁగొల్చుచును । శ్రీయుతముగనా । రాయణా
ఖ్యుఁడన । పాయతఁదెల్పిన । పగిదినిలువుమీ ॥ పెందుకు ॥

ఎదుకులకాంభోజి రాగము ॥ అటతాళము.

ఏమారియుండకుఁడెప్పుడుబోవునో । యీమేనునిశ్చయమా ।
సామర్థ్యబలమంత్ర । శాస్త్రతంత్రయుక్తు । లేమిపనికిరావుగ । వో
జనులారా ॥ యేమా ॥ నూరేండ్లుపరిమాణో । మేరుపరచిరది ।
సారెకునమ్మకుఁడీ । ప్రారబ్ధవశులకుఁ । బరిమితమెకర్రిడీ । దేరో
జోయేకాలమో । ఓజనులారా ॥ యేమా ॥ ధాతాదిదేవత । వ్రా
తముమానిసం । ఘాతములేమాయెనో । ఖ్యాతిగరామకృ । ష్ణాద్యవ

తారము । లేతెరువైపోయెనో । ఓజనులార ॥ ఏమా ॥ మనుశిబియి
క్ష్వాకు । మాంధాతసగరాది । జనుపాలులేమైరోకో । మనచేమి
శాశ్వత । మనవచ్చునుళ్లకిఁ । పనియుండుకాలములో । సద్గతిగనుఁ
డీ ॥ యేమా ॥ ధారుణిఁదాళ్లూరి । నారాయణశర్మా । ధారుఁదై
చెలువొందిన । కారుణ్యమూర్తివేం । కటశివగురుపద । సారసము
లుగొల్చియుఁ । జెడకనిలువుఁ ॥ డేమా ॥

యి. ౧౧ కళ్యాణి రాగము ॥ అటతాళము.

శ్రీగురువర్యుని, శేవింపవలెరా । చిన్మయస్థానము, సేరంగ
వలెరా ॥ శ్రీగు ॥ శిరమువెల్లగను । నరవకమునుపే । చెవ్రులకువుం
రము, చేరకమునుపే ॥ శ్రీగు ॥ సరగదంతపుష్టి, సడలకమునుపే ।
పొరలుగప్పికనులు, వోవకమునుపే ॥ శ్రీ ॥ కాయమువణఁకుచేఁ, గ
దలకమునుపే । పాయముచెడివృద్ధా, ప్యమురాకమునుపే ॥ శ్రీగు ॥
వాతాదివ్యాధులు, వడిరాకమునుపే । చేతికిదకండము, సేరకమును
పే ॥ శ్రీగు ॥ గళమునస్వరముత, గ్గకనుండుమునుపే । మలమూత్ర
ములచేత, మెలఁగకమునుపే ॥ శ్రీగు ॥ నడువఁగాళ్లుతడ, బడకుం
డుమునుపే । యొడలిచర్మమువ్రేలు, చుండకమునుపే ॥ శ్రీగు ॥ సం
కోచపడకుగ్ర, చ్చలమైలవరపు । వేంకటశివగురుఁ, డేబోధగఱపు
॥ శ్రీ ॥ అలరఁదాళ్లూరినా, రాయణదాసు । పలికినటులవిన్నఁ, బా
పమువాసు ॥ శ్రీగు ॥

కళ్యాణి రాగము ॥ అటతాళము.

ఇతరసంగతులేలరా । సద్గురునిసం । తతముఁగొల్చినఁజా
లురా । సతతముసద్గురు । చరణాబ్జసేవదు । ర్గతినిబోఁద్రోచిన । ద్గతి
నిచ్చుసత్యము ॥ యిత ॥ ఈషణత్రయములను । గలిసిసుఖ । యిం
పఁగఁదలఁపుచును । దోషకృత్యంబులు । తొలఁగకసలిపిసం । తోషిం

పుచుండీనఁ । మదముట్టేదెన్నఁడు ॥ యిత ॥ కామాదివృత్తులతో ।
జేరకనుని । షాఁ్కముఁడవైలీలతో । వేమారునీయందు । వెలుగుచుం
డుపరం । ధాముని గాంచిత । త్వరుఁడవైయుండకె ॥ యిత ॥ వివి
ధవిషయపాళీనీ । యింద్రియములఁ । దవులనీకబాళినీ । ప్రవిమలమతి
నాగి । భువినినారాయణ । కవిదెల్పినటులవేం । కటశివగురుఁగొ
లువు ॥ యిత ॥

నాదనామక్రియ రాగము ॥ అటతాళము

తెలివిగల్గెదెన్నటికిరా । యెంత । దెలిపిననినునీవు తెలియవే
టికిరా ॥ తెలి ॥ దేహాత్మబుద్ధిచేనీవు । యీ । మోహసాగరమందు
మునిఁగియున్నావు । దేహమెన్నటికీవుగావు । వి । దేహకైవల్యపిధి
నిదెలియలేవు ॥ తెలి ॥ సకలేంద్రియములతోఁబొందు । సలిపి । పికల
త్వమునవిఱ్ఱ, వీగుచునుందు । పిఁకనైనసద్గురునందు । భక్తి । బ్రకటిం
చిపరతత్వ, భావముఁబొందు ॥ తెలి ॥ జన్మములన్నిటిలోన । నర । జ
న్మమెకుడైన, జన్మముగాన । సన్మార్గముగదీనితోనఁ । బర । చిన్మ
యునెఱిఁగిభ, జించుబిరాన ॥ తెలి ॥ కేళిలోలతచేబాల్యమున । స్త్రీ।
లోలత్వముననుమే, లుగయవ్వనమున । జాలఁజింతలవార్ధికమున।ని
టులఁ । గాలముబోవునుగాకవ్యర్థమున ॥ తెలి ॥ అరమరలేరతాళ్లూ
రి । నారా । యణదాసబోధఁజ, య్యనవినుమోరి । పరమార్థమును
దెలియుకోరి । మైల । వరపువేంకటశివగురువరుఁజేరి ॥ తెలి ॥

శ్యామకళ్యాణి రాగము ॥ అటతాళము.

ఎంతబలమైనదిమాయా । యెంతీని తెలుపుదు నిదిచిత్రమా
య । నాకెదిచోద్యమాయ ॥ నెంత ॥ సంతతముమవెక్కు । చాతు
ర్యములుఁగలిగి ॥ వింతలుసేయుచు ॥ వెలసినదాయ ॥ నెంత ॥ ఇ
ల్లాలుశైశైలు । పిల్లలుసేనని । కల్లసంసారముఁ । గలిగించుటాయ

॥ నెంత ॥ ప్రజ్ఞానంబ్రహ్మని । భావించఁబోయితే । యజ్ఞానరూపమై । యడెతోచుటాయ ॥ నెంత ॥ భావమునందహం । బ్రహ్మాస్మియనఁబోతే । దావచ్చియడ్డమై । తలఁగించుటాయ ॥ నెంత ॥ తత్వమసివాక్యతా । త్పర్యమెఱుఁగఁబోతే । సత్వరగనుదానె । సాగనీదాయ ॥ నెంత ॥ అయమాత్మబ్రహ్మని । యానందించఁబోతే । భయజగదూప్రమై । భ్రమగొల్పుటాయ ॥ నెం ॥ ధరణిలోపలమైల । వరవు వేంకటశివ । గురుకృపగలిగితే । తిరిగిరాదాయ ॥ నెంత ॥ సారెకుఁదాళ్లూరి । నారాయణాఖ్యుని । జేరఁగవెఱగంది । దూరమైపోయ ॥ నెంత ॥

నాదనామక్రియ రాగము ॥ అటతాళము.

మాయమాయమాయను । నిత్యానంద । మయుఁగనుఁగొననాయను । ఈయివగలోక । చాయగనునను । బాయకుండెఁగ । దాయనాదిగ ॥ మాయ ॥ భవభయంబులుదీరెను । బహుజన్మసుకృతము । లవనిపైఁజేకూరెను । దవిలియుపనిషదర్థసారముఁ । జెవులుదనియఁగఁగ్రోలుకితమున ॥ మాయ ॥ ఎంచశక్యముగాకను । వివరించిచూడఁబ్ర । పంచమేతానగుచును । మించియెపుడుఁజరించినిజమును । గాంచినంతనెమించురీతిగ ॥మాయ॥ చాలచిత్రమాయను । గుర్తెఱుఁగఁబోలే । మూలమేలేదాయెను । మేలుగనుగురు । కీలుదెలిసిన । కాలమునఁగలలీలలేనని ॥ మాయ ॥ దోషపుంజముపీడెను । వేంకటశివ । దేశికునికృపతోడను । వాశిగనునారాయణాహ్వాయ । దాసునగునను బాసినిల్వక ॥ మాయ ॥

రేగుప్తి రాగము ॥ అటతాళము.

లేదులేమర మోక్షము । యెటుజూచిన ॥ లేదు ॥ లేదులేదురగురు । పాదాబ్జములుఁగొల్చి । సాదరమగుతత్వ । సాదమొందకయు

న్న ॥ లేమ । వైద్యములనుగాంచి । యిపిన్నే(గాదు । కాజనిపిడిపించి । పాపుగడల్చియ । నాదిమాయను ద్రేడ్పు( । బో(దోలియాపైది । యే దోచూడకయున్న ॥ లేమ ॥ వేదశాస్త్రజాలము( । జదివియుమూల । మేదో తెలియ(జాలము । మోదమునను బుద్ధి । భేదముతో(దర్పు । వాదములాడిన । సాదానికేకాని ॥ లేమ ॥ దృష్టజగము(రోసి । అంత టికిని । ద్రష్ట నేనని తెలిసి । దృష్టద్రష్టల రెంటి । నష్టము జేసివి । శిష్ట తె లివితానై । స్పష్టపడకయున్న ॥ లేమ ॥ ఆశపాశము(గోసి । నారా యణ । దాసునివలెడాసి । వాశిగశ్రీమైల । వరపు వేంకటశివ । దేశి కు(గనియుప । దేశ మొందకయున్న ॥ లేమ ॥

రేగుప్తి రాగము ॥ అటతాళము.

ఏటికినీభ్రమపోరా । వట్టి । బూటకమనినమ్ముకోరా । ఏటికినీ భ్రమ । యెన్నాళ్ళకైనను । గాటికి(జేరేదే । కానినిల్వ(గ(బోదు । తె టగనుజాతస్యమరణం । ధ్రువమటంచును వేదజాలము । మాటిమాటికి( జాటుచుండిన । మాటనీమదినాటదేమో ॥ యేటి ॥ కోటివిద్యలు నేర్చి కొన్న( । బొట్ట । కూటికే వేఱులేదన్న । నీటిమీ(దిబుగ్గా । వాటము గను తెప్ప । పాటుకాలములోన । ట్టట(బుట్టిముంచు( ! జేటులకు మూలంబుదీనికి( । బాటుపడ నేమిటికి(బిన్నట । నాట(గోలె(ద్రికూట మున(గల । మేటినరయుచు( జెడకి నిలువుము ॥ యేటి ॥ నిత్యముగా నిదిజుండు । యెపుడు । మృత్యువుపెన్నంటియుండు । నిత్యంసన్నిహి తో । మృత్యువనుచునున । నిత్యానిశరీరా । ణియన(శ్రుతులువలుక । సత్యముగవినలేదెయాయమ । భృత్యులకులో(బడకనిత్యా । నిత్యవస్తు వివేకమున(గృత । కృత్యు(డవుకాకమ్ము జీవు(డ ॥ యేటి ॥ భావింప( గలిమిలేములును । జీవ । కావటికుండలవలెను । వేవేగ(జీకటి । వె న్నెలవిధమున( । దావచ్చియంతలో( ॥ బోవుచునుండును । గావున నునీవిపుడువిభవో । నైవశాశ్వతమనెడువచనము । గేవలముభావ

మున నెంచియు । ధీవిలక్షణుసేవ జేయుము ॥ యేటి ॥ అరివర్గములను జయించి । నారా । యణదాసుబోధనాలించి । నిరతము మండలాం । తరమున వెలుఁగొందు । పురుషోత్తమునిమైల । వరపు వేంకటశివ । గురునిగావీక్షింపుచుండియు । నిరతిశయసుఖతత్పరుడవై । పఱఁగినను సాయుజ్యమోక్షము । కరతలామలకంబుగాదె ॥ యేటి ॥

పంతువరాళి రాగము ॥ ఆదితాళము.

చిద్విలాసమెఱుఁగవలెనురా । ఓరోరిజీవ ॥ చిద్వి ॥ చిద్విలాసమెఱుఁగవలెను । సద్వయాత్ముఁడైనగురుప । దద్వయములుగొలిచి యుపని । షద్విమర్శచేసిపరను ॥ చిద్వి ॥ మూడుదారులరయవలెనురా । నడిదారివోవు । జాడఁజూచికూడవలెనురా । ఆజాడవెంట । నేడుమేడలెక్కవలెనురా । పైమేడఁజేరి । మూడునదులలోనస్నాన । మాడివేడుకలరఁగాను । మూడువెలుఁగులొకటవెలుఁగఁ । గూడివెలుఁగుచుండుపరము ॥ చిద్వి ॥ చింతలెల్లఁబాయవలెనురా । దుర్విషయపాళి । చెంతఁజేరకుండవలెనురా । కామాదిరిపుల । సంతతముహరింపవలెనురా । అజ్ఞానమనెడు । ధ్వాంతమెల్లనడఁచియమిత । శాంతిదాంతిగలిగిమాన । సాంతరీక్షమందుఁజేరి । వింతలెల్లఁగాంచిపరము ॥ చిద్వి ॥ శంకలన్నితీరవలెనురా । నెమ్మనమునందు । పంకుగుణముపిడువవలెనురా । దుష్కర్మతతుల ॥వంకఁదిరిగిచూడవలదురా । నామాటవినుము । ఇంకనైననమైలవరపు । వేంకటశివయోగిపాద । పంకజములుగొలిచినిష్క । ళంకమైనపదవినొందు ॥ చిద్వి ॥

పున్నాగరాగము ॥ అటతాళము.

వానితో సరిలేరురా । ఆత్మనుగన్న । వానితోదీటెవరురా । మానుగలేని । దానినిమాని । పూనిబ్రహ్మానుసం । ధానముఁజేసిన ॥వానితో॥ అతులులుముడిచీ । యట్టరుఁగడచీ । యక్షయపదముఁబ్ర । త్యక్షముగాఁ

గన్న ॥ వానితో ॥ పిండముఁగాంచి । కుండలిఁజించి । అండపిండాండబ్రహ్మాండములమించిన ॥వానితో॥ బిందువుఁదెలిసి । యందులోఁగలిసి । పొందుమీఱఁగనిత్యా । నందమునొందిన ॥వానితో॥ కోపము విడిచి । తాపములఁడచి । రేపుమాపునుస్వస్వ । రూపముఁగనుఁగొను ॥వానితో॥ క్లేశముమీటి । కోశములుదాటి । ఆశపాశమును । వాసిగఁగోసిన ॥వానితో॥ భవములుదొలఁగ । శివములుగలుగ । భువిలోన వేంకట । శివగురునెఱిఁగిన ॥వానితోసరిలేరురా॥

హిందుస్థానికాపిరాగము ॥ ఆటతాళము.

మానససద్గురు । ధ్యానముఁజేయవే । మానుగముక్తిని । ధానమునిచ్చును ॥మానస॥ పెంపుగజన్మప । రంపరలందును । సొంపుగఁజిక్కిత । పింపఁగనేలను ॥ మానస ॥ తీరనిసంసృతి । వారిధినుంచి । తీరముఁజేరిచి । సారెకుఁబోధించును ॥ మాన ॥ దేహమురానీ । మోహములేని । సోహంభావముఁ । జూపునుసత్యము ॥ మాన ॥ కర్మముగాని ॥ ధర్మముఁబూని । నిర్మలుఁడవ్వే । మర్మముఁదెల్పును ॥ మాన ॥ ప్రాపునజేర్చి । తాపముదీర్చి । పాపముఁదెల్లను । బాపును గదవె ॥ మాన ॥ శంకలుదీరఁ । బంకములార । వేంకటశివగురుఁ । డింకనుబోధించును ॥ మాన ॥ శ్రేయముతోడనా । రాయణదాసకృ । తాయతబోధన । దావినివేగమె ॥ మాన ॥

యిమునాకళ్యాణి రాగము ॥ ఆదితాళము.

ఎంచుఁజూచినను సత్యజ్ఞానా । నందమయంబైయున్నదిరా । మందమతులకీమార్గముమిక్కిలి । సందియంబుగనుదోచునురా ॥యెంచు॥ భూరిచరాచరభువనకార్యస । త్కారణమదియైయున్నదిరా । చారుతరంబగుసకలోపనిష । త్సారమదియునైయున్నదిరా ॥ యెంచు ॥ పంచకోశవ్యతిరిక్తంబైపరమగోప్యమైయున్నదిరా । పంచవింశతితత్వ

సంచయము । మించిమించువలెకెల్లునురా ॥ యెందు ॥ ప్రాకటము గనుద్రివర్ణాత్మిక ప్రణ । వాకారంబైయున్నదిరా ॥ లోకంబులుదన। లోపలఁదాల్చుక।యేకాకృతియైయున్నదిరా ॥ యెందు ॥ రాకపోక లనువ్యాకులమేమియు । లేకప్రబలియదియున్నదిరా । శోకమోహ ములఁజొక్కకనిత్యని । రాకారంబైయున్నదిరా ॥ యెందు ॥ ధరవేం కటశివ । గురువరబోధిత । పరమార్థంబైయున్నదిరా । అరయగనా రా । యణదాసుకుహృద । యానందంబైయున్నదిరా । యెందు ॥

హిందుస్థానికాపీ రాగము ॥ ఆటతాళము.

నీవువినాపెర । దేవుఁడులేఁడు । భావములోపల । భ్రమయ కచూడు । దేవుఁడెజీవుఁడు । తెలియుమునేడు । నావచనమ్మును । న మ్మునీతోడు ॥ నీవు ॥ సకలజగంబులు । సత్యముగాని । ప్రకృతికృతం బని । భ్రాంతినిమాని । వికలములేని । వృత్తినిబూని । యొకడఁవెని ల్చి । యుండితివేని ॥ నీవు ॥ దారసుతాదులు । ధనమునుగల్ల।దాన ముధర్మము । దనకేమెల్ల । సారములేనిది ॥ సంసృతియిల్ల । వేరయి దీనిని । విడచుటవల్ల ॥ నీవు ॥ మాయకులోనై ॥ మాటికిభిన్న । కా యములెత్తుచు । గాశిలకన్న । కాయమునిక్కముగాదిదిసున్న । పా యకదానికిఁ । బరమైయున్న ॥ నీవు ॥ వేంకటశివగురు । విశ్రుతపా ద । పంకజయుగ్మము । ప్రాపగుఁగాదా । పంకములోఁడుతఁ।బూ జింపరాదా । సంకోచంబులు । సమయునామీఁద ॥ నీవు ॥

మధ్యమావతి రాగము ॥ ఆదితాళము.

శ్రీరాజయోగులెల్లఁ । జేరేనెళవేదే । నారు । జేరే । విను। మారుచక్రంబుల । కవలఁగాదటవే ॥ శ్రీరా ॥ ఆరుచక్రములన । న వియేవెకొమ్మా । అల్లవి ॥ ఆ । ధారాదియాజ్ఞేయాం । తముగాద టవమ్మ ॥ శ్రీరా ॥ఆధారమందుండేయధిదైవమెవరే॥ దానికధి॥మూ।

లాధారమందుగణ । నాథుఁడుగదవే ॥ శ్రీరా ॥ స్వాధిష్ఠానముమీఁది
స్వామియెవరమ్మా । ఆస్వామి । స్వాధిష్ఠానమునభా । షాధీశుఁడ
మ్మ ॥ శ్రీరా ॥ మణిపూరకమందుండే । మహానియ్యుఁడెవరే ॥ అమ్మ
హా ॥ మణిపూరకమందున్నది । మాభర్తగదవె ॥ శ్రీరా ॥ సతియ
నాహతమందలి । సరసుఁడెవరమ్మ ॥ ఆసరసు ॥ అనా । హతచక్ర
మందుగౌరీ । పతిగాదటవమ్మ ॥ శ్రీరా ॥ చెలియవిశుద్ధమందు । ని
లిచినదెవరే ॥ యందునిలిచిన ॥ మదిఁ । జెలఁగివిశుద్ధమందు । జీవా
త్మగదవె ॥ శ్రీరా ॥ ఆజ్ఞేయమందుండే । దతఁడెవ్వరమ్మా ॥ అల్లత ॥
డౌ । నాజ్ఞేయమందుఁబర । మాత్మగదవమ్మా ॥ శ్రీరా ॥ ఆఱుచ
క్రంబులకవలయేమమ్మ ॥ వీనికవల ॥ ఈ । యాఱింటిపైనసహ ।
స్రారమోయమ్మ ॥ శ్రీరా ॥ కోరియటుఁజేరుటకు । దారియేదమ్మ ।
చాయ । దారి ॥ ఆ ॥ దారిదెలిసినవారేధన్యులోయమ్మ ॥ శ్రీరా ॥
ఆదారినరిగినాదామేమమ్మ ॥ ఆనాద ॥ ఆనాదమేప్రణవనినాదా
మోయమ్మా ॥ శ్రీరా ॥ నాతియచ్చోపెల్గేభాతియేమమ్మ । ఆభాతి ॥
ఆ । భాతియేకనుమాసో । జ్యోతిగదవమ్మ ॥ శ్రీరా ॥ కాంతికిఁబై
నున్నకాంతయెవరమ్మ ॥ ఆకాంత ॥ ఓ । యింతిరోయదెముక్తికాం
తగదవమ్మా ॥ శ్రీరా ॥ తరుణితోనెనసినపురుషుఁడెవరమ్మ ॥ ఆపు
షు ॥ మైల । వరపువేంకటశివ । గురువరుఁడమ్మ ॥ శ్రీరా ॥ చేరిస
ద్గురుపూజజేసెదెవరమ్మ ॥ పూజజేసే ॥ తా । ళ్లూరినారాయణా
ఖ్యుఁడుగదవమ్మ ॥ శ్రీరా ॥

కాంభోజి రాగము ॥ అటతాళము.

మాయకులోనైనీ । పాయమంతయువృథా । చేయఁగమేలుగా
దోయిపోవోయీ । వేయిదళాంతర । స్థాయియైనగురు । రాయునిఁ
గొల్వఁగ । రాదానాతోవాదా ॥ మాయ ॥ వేడుకతోడనీ । యీ
డుబాలకుల । జోడుగూడియాట । లాడికొన్నాళ్లు । జేడెలకౌఁగిళ్లఁ ।

జేరిమారునికేళిఁ ॥ గూడిక్రీడింపఁగఁ।గొన్నాళ్లుచనియెను ॥ మాయ ॥
దారపుత్రసహా । దరబంధుహితపరి । వారముతెల్లనా । వారనితె
లుపుచుఁ । చేరుక్రిందిప్రతిమ । తీరునననయమా । భారమునీపైనఁ ।
బడినట్లుకొన్నాళ్లు ॥ మాయ ॥ ఇటువంటిదశలుని । ష్పటికెన్నిపో
యెనో । తటుకుననింకమీఁ । దటనెన్నికలవో । కటకటతెలిసియుం ।
తటమైలవరపువేం । కటశివగురునిచ । క్కటికేగిఘనరాదే ॥ మా
యకులోనైనీ ॥

బేహాగ్ రాగము ॥ ఆదితాళము.

కనుఁగొనరాదా । కనుపించలేదా । కనువానిమీఁద । నణు
రూపెకాదా ॥ కను ॥ సందియమేంను । కందజేయంచు । జెందిపె
ద్దొందు । చిన్మయునింపుఁ ॥ కనుఁగొ ॥ అహముసుమాని । అతిభక్తి
బూని । దహరముపైని । విహరించువానిఁ ॥ గను ॥ విషయేంద్రియ
ములఁ । దవిలితద్విషయముల । వివరించువాని । శివగురుఁడేయ
ని ॥ కనుఁగొ ॥

సావేరి రాగము ॥ ఆదితాళము.

మహిమదెలియఁదరమా । గురుమహిమ । బహుజన్మార్జిత ।
పాపములడఁచిన । మహనీయ్యుండగు । సద్గురువర్యుని ॥ మహి ॥ త్రి
గుణంబులునులిపి ॥ చెవిలో । నిగమార్థముదెలిపి । ముగురుమూర్తుల
కు । మూలమైనయా । త్రిగుణాతీతుని । నగుపరచినగురు ॥ మహి ॥
జన్మభయముబాపి । పర । చిన్మూర్తినిజూపి । సన్మార్గంబున । సంచ
రింపుమని । సన్మానించిన । సద్గురువర్యుని ॥ మహి ॥ త్రివిధకరణ
ములను । దత్కృత । త్రివిధకర్మములును । దవులకకాంచుచుఁ । బ్రవి
మలుఁడగునై । లవరపువేంకట । శివగురువర్యుని ॥ మహి ॥

యమునాకళ్యాణి రాగము ॥ అటతాళము.

దేశకునితోటిసరి । దేవుఁడెవరె ॥ మనదేశ । ఉప । దేశమొ
సఁగినపర । మేశుఁడితఁడే ॥ మనదేశ ॥ ఆశలనుబాశముల । నాశన

ము జేసి పంచ । కోశములఁ దోసి స్వప్ర । కాశము డాసి చూపు ॥ దేశ ॥ పుట్టిగిట్టుటలను । నట్టి భయమ్మెటైతుద । ముట్టఁ బోఁ గొట్టి చే । పట్టి బోచిన నట్టి నన ॥ దేశ ॥ మాయాసుయజాయాసుత । కామేంద్రియ వాయుసము । దాయము నుబాయుసము । పాయము నెటిఁగించిన ॥ దేశ ॥ మందులందఱు నభి । నందించిన సందించిన । డెంద మున సందియము । నొందకానంద మొందు ॥ దేశ ॥ పొంచి లోమించి విహా । రించు రిపు సంచయముఁ । ద్రుంచి కృపయుంచి పర । మెంచిక నుపించునున ॥ దేశ ॥ వ్యక్తియాసక్తికడు । యుక్తిపదభక్తిగల ॥ భక్తులకుముక్తివి । ధ్యుక్తముగ రక్తినిడు ॥ దేశ ॥ వాశిగను నారాయణ । దాసునకు దోసములు । బాసి పోఁ దోసి దయ । చేసి చిద్విలాసుఁడగు ॥ దేశ ॥ కింకరుల శంకల ను । బొంకముగ మాన్పియక । శంకుడగుఁ మైలవర । వేంకటశివవర ॥ దేశకుని తోటి ॥

పంతువరాళి రాగము ॥ అటతాళము.

బట్టబయలై యున్నదదిగో రా । పరమాత్మ నీలో । బట్ట । బట్టబయలై యున్నదదిగో । పిట్టపల్లములనక నంతటఁ । జుట్టుకొని మనుమొదలుకొని యీ । పట్టివరకును దట్టమైతాఁ । జట్టువలె నేకదలకున్నది రా । అది లేని చోటే । తట్టుజూచిన లేకయున్నది రా । జగములజోలి । పెట్టుకోకను పాదుకొన్నదిరా । యెన్నాళ్ళకైనను । బుట్టుచావులఁ బొరయకున్నదిరా । వట్టియాశలు వదలుకొని యీ । గుట్టుదేశకవరుని చేతను । దిట్టముగఁ దెలిసినను పారము । ముట్టవచ్చు నని శ్చయంబుగ ॥ బట్ట ॥ సందుగొందులు దూరియున్నదిరా । బాహ్యాంతరంబుల । ముందు వెనుకనునిండియున్నదిరా । యింద నందను సందియము లే । కెందుఁ జూచిన నందెకలదై । యుందిదీనిఫసంచు దెలియఁగ । మందమతులకు నందము గునా । ముందు గురుపద సేవ జేయకను । కామాద్వైరులఁ । గుందియవతలఁ దీసి వేయకను । వివరించి యింద్రియ । బృందములతోఁ బొందు

రోయకను । జీవేశ్వరైక్యా । నందపరుడైకనులుమూయకను । బొం
దుమీఱసనందనాదిము । నీంద్రవందితమైయఖండా । మందమైవెలుఁ
గొందుతత్వము । విందుగాఁగనుఁగొనెడువారికి ॥ బట్ట ॥నిండినిబిడం
బగుచునున్నదిరా । యేఛాయఁబోయిన । నండచాయకినంటియున్నది
రా । ఎండమావులవంటియీబ్ర । హ్మాండభాండములన్నితనలో । నుం
డినునువిలయంబునొందిన । నొండుగురైఁగంగలేకన ॥ ఖండమైరం
జిల్లుచున్నదిరా । సూర్యాగ్నిహిమకిర।మండలంబులదూరియున్నదిరా।
తనకంటెనిఁకవే । ఱొండువస్తువలేకయున్నదిరా । మాహాత్ములకుఁ
దా । నుండియునుగనుపించకున్నదిరా ॥ ఖండితంబుగమైలవరవేం ।
కటశివాఖ్యగురూత్తముఁడుదా । దండిగనునారాయణాహ్వయ । దా
సుకెఱిఁగించినపదార్థము ॥ బట్ట ॥

నాదనామక్రియ రాగము ॥ ఆదితాళము.

రాదురాదురాదు । సద్గురునికరుణ ॥ రాదు ॥ ద్వాదశసంవ।
త్సరశుశ్రూషలు । సాదరమతితో । సలుపకగురుకృప ॥ రాదు ॥ త
నువునుమనమును । ధనమునుదనకును । వినయంబునన । ర్పణచేయ
కఁగృప ॥ రాదు ॥ అంగస్థలభా । వాత్మశేవలు । పొంగుచుఁజేయ
కఁ । బూర్ణమైనదయ ॥ రాదు ॥ దినదినమునుసా । ధనచతుష్టయం ।
బనుసంపదలే । నట్టివారిపై ॥ రాదు ॥ ఈషణములపై । నీషణ్మాత్ర
ము । ద్వేషింపనియా । దోషులపయిదయ ॥ రాదు ॥ ధరనారాయ
ణ । దాసునివలెనన ॥ వరతముఁగొలువని।వారిపయినదయ ॥ రాదు॥
శ్రవణత్రయమును । సాధింపకమై । లవరపువేంకట । శివగురునకుద
య ॥ రాదు ॥

కాంభోజి రాగము ॥ అటతాళము.

సుదతులారయాంపో । జ్యోతిరూపముగనులఁ । జూడరమ్మా ।
విదితముగనాత్మ । యదియనిభావించి । వేడరమ్మా ॥ సుద ॥ సద

మలముగశుద్ధ । స్ఫటికసంకాశమై । పొదలెనమ్మా । ఫణివిధముల
మ్రోయియు । ప్రణవనినాదము । ల్లవియేనమ్మా ॥ సుద ॥ నీలతోయద
మధ్యా । న్వితవిద్యుల్లేఖను । బోలునమ్మా । చాలసూక్ష్మసుషుమ్న
నాళములోపలఁ । గ్రాలునమ్మా ॥ సుద ॥ అండపిండాండబ్ర । హ్మాం
డభాండముల । నిండెనమ్మా । ఖండాంశచంద్రాగ్ని । మండలముల
నడుమ । నుండునమ్మా ॥ సుద ॥ శ్వేతరక్తకృష్ణా । సితపీతవర్ణస ।
మేతమమ్మా ॥ భూతలముఖపంచ । భూతములకునున । తీతమ
మ్మా ॥ సుద ॥ రంగుగగంగాస । రస్వతియమునల ॥ సంగమమ్మా ।
పొంగుచువీక్షించు । పుణ్యాత్ములకునంత । రంగమమ్మా ॥ సుద ॥ అం
దరిఁలోఁబ్రత్య । గాత్మరూపమునవె । ల్గొందునమ్మా । అందముగన
దిమె । పొందుగసచ్చిదా । నందమమ్మా ॥ సుద ॥ సాక్షాద్వేంకటశి
వసద్గురుకృపచేఁబ్ర । త్యక్షమమ్మా । అక్షయముగనారా । యణదా
సునకునంత । ర్లక్ష్యమమ్మా ॥ సుదతులార ॥

ముఖారి రాగము ॥ ఆదితాళము.

లేనేలేముగదా । దృశ్యము । కానేలేదుగదా ॥ భూనీరాదిక ।
భూతజాలని । ర్మాణమైనయీ । నానాజగములు ॥ లేనే ॥ నూను
గరజ్జువు । లోనఁదోచియును । గానఁగఁబోవఁద్రి । కాలంబులఫ
ణి ॥ లేనే ॥ నిండుదాహమున । నీరనిభ్రమసిన । నెండమావులం । దె
ప్పటికుదకము ॥ లేనే ॥ శుక్తివెండియని । చూచిభ్రమసితన । యుక్తి
తోడఁగన । నొప్పుగరజతము ॥ లేనే ॥ ఎండుమొద్దుపురు । షుండని
చూచియు । నండజేరినిజ । మరసినమనుజుఁడు ॥ లేనే ॥ ధరవేంకట
శివ । గురువరబోధిత । పరమార్థముద । ప్పఁగనొండేమియు । లేనే ॥
అరయఁగనారా । యణశర్మకుగో । చరమగుబ్రహ్మా । తరమగుభు
వనము ॥ లేనే ।

రేగుప్తి రాగము ॥ ఆదితాళము.

ఏమిలేదనియనెనే । సద్గురుఁడింక ॥ నేమిలేదని ॥ ఏమిలేదని యనె । నేమానినీమణి । యీమూలంలేనిగ। రైరిగేశరీరము ॥ యే మి॥ చిత్తమునందునన్య । చింతనమానుమింక । యెత్తైలఁగునఁజూడ । ను త్తదీబట్టబయలు ॥ యేమి ॥ లోలతమీఱఁగల । లోఁదోచేశరీరాలు । యెలాగోయాలాగే।యేలభ్రమసెదవింక ॥ నేమి । ప్రత్యక్షముగఁగను పట్టుచునుండునట్టి ।సత్యబ్రహ్మమునందు।నిత్యముగానిజగము ॥యేమి॥ అట్టేవ్యాపించియున్న । బట్టబయలులోన । మొట్టమొదటజగము। వుట్టనేలేదుకనుక ॥ యేమి ॥ కోరికదీరెఁదా । శ్రీహరినారాయణాఖ్య। యారూఢజ్ఞానివైతి । వహానీయందులోప ॥ మేమి ॥ సంకల్పమే లేదు । యింకేమిమాటలని । కొంకకమైలవరపు । వేంకటశివగు రుఁ ॥ డేమి ॥

కాపీ రాగము ॥ అటతాళము.

పాదములేనమ్మితినమ్మితి ॥ దివ్య ॥ పాదము ॥ పాదములార్తి ని । ర్చేదములపహృత । ఖేదములత్యంత। మోదములగుగురు ॥ పాద॥ వరసుషుమ్నాంతర । వాసమైఖళఖళ । మెరయుముక్తినిగూడి । ము రియుసద్గురుదివ్య ॥ పాద ॥ శ్రుత్యంతములయందు । నత్యంతముగ వెల్గు । ప్రత్యగాత్మనుదెల్పె । ప్రజ్ఞానఘనగురు ॥ పాద ॥ ధరణితా ళ్లూరికృష్ణ । దాసునిహృదయమం । దిరుఁడగుశ్రీమైల । వరపుశివగురు దివ్య ॥ పాద ॥

అసావేరి రాగము ॥ త్రిపుటతాళము.

మగువరోమద్గురిని । మహిమలన్నియుఁ దెలియ । మందమతు లవశమా ॥ సగుణనిర్గుణసారమెఱుఁగఁగ । సత్తుచిత్తులజాడదెల్పుచు । నిగమవేదితనిత్యపదమును । నిర్మలంబుగఁదెల్పునమ్మ ॥ మగ ॥ నిర్ణ యింపఁగరాని । నిజవస్తువెతిఁగించి । నిఖిలమునీవనుచును ॥ వర్ణభే

డముమానునునుచును । గర్వమందునఁబూర్ణభావము । నిర్ణయంబు
గఁదెలిపితానును । బూర్ణుఁడైవిహరించుఁజెలియ ॥ న॥ అపరో
క్షజ్ఞాన । మానందభావము । లుపముసెయుఁగఁదెల్పుచు । జపతపం
బులునెన్నిచేసిన । జన్మమెత్తకఁబోవనివ్వవు । చపలమేటికిసూక్ష్మదృ
ష్టిని । జాడఁజూడుమటంచుఁబల్కుచును ॥ మగు ॥ పొంకముగశివ ।పూ
జఫలముచేత । వేంకటశివయోగికిఁ । గింకరత్వముఁబూనిభక్తిని ।
గొంకులేకనుగృష్ణదాసుఁడు । శంకలన్నియుఁదీరితానే । శంకరుండై
చెలఁగెనవే ॥ మగువరో ॥

ముఖారిరాగము ॥ అటతాళము.

ఎంతోవింతమేమనందుఁ । జింతింపసద్గురుకృపొందు । వింత
గభూర్జిమధ్యమందు । వేదసారమైయుంపొందు ॥ యెంతో ॥ కానవ
చ్చుకన్నులచాయ । లోనఁజూడవెన్నెలాయ । జ్ఞానోదయమైనదా
య । జ్ఞానజ్ఞేయాతీతమాయ ॥ నెంతో ॥ నేతినేతివాక్యముల । నిర్ణ
యింపమాయజాల । మేతీరైపోయెనోచాల । నేమిచెప్పుదట్టిలీ
ల ॥ యెంతో ॥ ఓంకారమాలించుటాయ । వ్యోమవీధినుండుటాయ ।
వేంకటాఖ్యవెలయుటాయ । శంకలన్నితీరుటాయ ॥ నెంతో ॥ అం
తేవాసికృష్ణుఁడాయ । నంతరంగభక్తిజేయ । సంతసించిగురునిడా
య । సద్గతికాధారమాయ ॥ నెంతో ॥

మధ్యమావతి రాగము ॥ అటతాళము.

ఏమిచేతుగదవే ।శ్రీగురురాయ ॥ యేమి ॥ ధీమసంబునదిడ్డి
వాకిలిఁ । దీసిమెల్లనవర్తమంటె । పాముపలెనేదారికడ్డము । పండు
కొన్నదిపాపిమాయ ॥ యేమి ॥ మాయమాయమాయనే । శ్రీగురు
రాయ । మాయలేనిదాయనే । కాయములైనైనైనమెత్తి ।కష్టమొందు
చునుండఁగాని । చేయరానిపనులుమాని । చెలఁగినిన్నుఁగలిసియుం

డ ॥ దేమి ॥ అండమందుఁగంటిని । బ్రహ్మాండమంత । పిండమందుఁగంటిని । రెండుమూడునొకటియగుచు । గుండుదిరిగియుగోప్యమైన । పుండరీకములోననిన్నుఁ । బూజచేయనియ్యదింక ॥ నేమి ॥ సంకటముదీరెను । నిశ్శంకయగుచు । శంకలెల్లఁబాపెను । వేంకటశివయోగికృపను । జంకుదీరెనుకృష్ణదాసుడు । అంకలిగాదింకనతఁడు । నజునివిద్యకునధికుఁడాయను ॥ యేమిజేతుగదవే ॥

ఏలపాట ॥ అటతాళము.

శ్రీగురుమూర్తిపాదప । రాగముశిరముసోక । సాగిలిమ్రొక్కినఁజాలును ॥ ఓభక్తులారా ॥ వేగమేపాపములడఁగును ॥ ఎన్నిజన్మములకైనఁ । దన్నుఁదానుఁదెలిసికొన । కున్నముక్తిజెందవచ్చునె ॥ఓభక్తులారా॥ యెన్నదగినమార్గమదియేను॥ మతములన్నియొకటిచేసి । మమతలన్నితెగఁగోసి । సతిసుతాదులనుబోఁద్రోసి ॥ ఓభక్తులారా॥ అతులితసద్గతికిఁజేరుఁడీ ॥ జపముతపములెల్లమాని । యెపుడుసద్గోష్ఠినిబూని । యుపనిషదర్థముదెలియుఁడీ ॥ ఓభక్తులార ॥ కపటకృత్యములువదలుడీ ॥ చేరువమైయున్నముక్తి । దారిదెలియనేరకసంసారవార్థినీదుచుండిన ॥ ఓభక్తులార ॥ పారముముట్టఁగవచ్చునే ॥ పంచకోశములకునవలఁ । బంచవన్నెలకునడుమ । మించువలెవెలుఁగుచుండును ॥ ఓభక్తులారా॥ కాంచిదానిమర్మమెఱుఁగుడీ ॥ ఘట్టిగదేహత్రయము । వట్టిదిలేదనిలోని । గుట్టుగురుముఖమునఁదెలిసితే ॥ ఓభక్తులారా ॥ బట్టబయలైకానుపించును ॥ పొంకముగనున్నెలవరపు । వేంకటశివయోగీంద్ర । కింకరులైయున్నవారికి ॥ ఓభక్తులారా ॥ శంకలెల్లఁదీరకుండునే ॥ కూరిమితోడఁదాళ్లూరి । నారాయణదాసబోధ । జేరియాలించినవారికి ॥ ఓభక్తులారా ॥ సారమైనపదవిగలుగును ॥





# మానసపూజావిధానము.

---

హిందుస్థానికాపీ రాగము ॥ అటతాళము.

రమ్మనితోడుకొని । రాగదేగురునింక ॥ రమ్మని ॥ సమ్మతితో వింత । సద్గురునిచటికి ॥ రమ్మని ॥ పలుకులకందకను । దలఁపులఁజెందకను । వెలిగెడుబ్రహ్మమును । వెలఁగుచుఁగాంచుగురు ॥ రమ్మని ॥ మాయామోహఁగలయక । మాటికిభ్రమయక । గాయమునశ్వరముఁ । గాఁగనుగురునిం ॥ రమ్మని ॥ చింతలకరుగక । జింతలనెఱుఁగక । భ్రాంతినిముసుఁగక । సంతసమొందుగురు ॥ రమ్మని ॥ పొంకముమీఱనిజ । కింకరచయముల । శంకలుబాపువర । వెంకటశివగురు ॥ రమ్మని ॥

ఆవాహన ॥ శహాన రాగము ॥ ఆదితాళము.

వేంచేసెనమ్మయెంతో । వేడుకతోడగురుఁడు ॥ వేంచేసె ॥ సంచితాగామికర్మ । సంచయమునద్రుంచ ॥ వేంచేసె ॥ నిజపాదపద్మయుగళ । భజనజేసెటివారి । వృజనములడఁచివైచి । సుజనులఁజేయుటకు ॥ వేంచేసె ॥ విశ్వముసకలమును । నశ్వరమనుచునుజీ । వేశ్వరైక్యముఁదెల్పి । శాశ్వతపదవినొసఁగ ॥ వేంచేసె ॥ కృపతోడశిష్యులకుఁ । జపలగుణములడఁచి । యుపనిషదర్థమును । నుపదేశమొనరింప ॥ వేం ॥ కింకరజనులమనో । పంకములార్పఁగని । శ్శంకుఁడైనైలవరపు । వేంకటశివగురుఁడు ॥ వేంచేసె ॥ పాయకఁదాళ్లూరినా । రాయణశర్మహృదయ । తోయజాతమునందుఁ । దోఁచుచునుండుగురుఁడు ॥ వేంచేసె ॥

ఆసనము ॥ ఆనందభైరవి ॥ ఆదితాళము.

శుద్ధాసనమునొసంగరమ్మ । పరి । శుద్ధాంతఃకరణులగుచు । శుభముగసద్గురునకు ॥శు॥ పంచకోశవిలక్షణునకు । బ్ర । పంచాతీతునకుసర్వాత్మునకు । పంచ । పంచతత్వస్వరూపకునకు । భూతం పంచకేంద్రియవిషయ । పంచకవ్యాపకునకు ॥శు॥ అత్యంతముక్తిదాయకునకు । నిత్యా । నిత్యపదార్థవివేకునకు । నిజ । భృత్యమానసరంజనునకు ॥ శుద్ధ ॥ ప్రత్యగభిన్నపూర్ణబ్రహ్మావలోకనునకు ॥శు॥ అరిసముదాయనివారునకు । నారా । యణదాసహృదయసంచారునకు । పరా । త్పరునకమితదయాళునకు । మైల । వరపువేంకటశివగురువరేణ్యునకు ॥శుద్ధాస॥

పాద్యము ॥ శంకరాభరణము ॥ అటతాళము.

పాద్యమివరమ్మ । సద్గురునకుం । పాద్య॥ పాద్యమివరమ్మయో । పంకజాక్షులార । ఆద్యంతరహితున । కానందమునవిపుడు ॥ పా ॥ మందారచంపక । మాధవీపున్నాగ । కుందకరవీరాది । కుసుమాన్వితంబుగం॥పాద్య॥ ఘనసారపాటీర । కర్పూరవాసిత । ఘనతోయములుం దెచ్చి । కడువేడ్కతోడుత ॥పాద్య॥ ధరనునారాయణ । దాసనన్నుతమైల । వరపువేంకటశివ । గురునిపాదములకుం ॥పాద్యమివరమ్మ॥

అర్ఘ్యము ॥ ముఖారిరాగము ॥ ఆదితాళము.

గురునకర్ఘ్యమిడరే । శ్రీగురు । వరునకర్ఘ్యమిడరే । పరమభక్తితో । భావమలరనఘ । హరునకర్ఘ్యమిడరే ॥ గు ॥ మంగళకరముముగను । యమునా । గంగోదకములను । బంగరుకలశము । లంగడువేడ్కంజె । లంగందెచ్చితగను ॥ గు ॥ స్థిరముగమైలవర । వేంకట । శివగురుయోగివర । కరతలమందునం । బరిమళసుమసం । భరితజలముతోను ॥గురునకర్ఘ్యమిడరే॥

ఆచమనీయము ॥ ఝంఝూటి ॥ అటతాళము.

శుద్ధాచమనమాచరా । శ్రీగురురాయ ॥ శుద్ధా ॥ శుద్ధాచమనమాచ । రేద్ధచరితసుప్ర । సిద్ధానందరూపకా ॥ సద్గురురాయ ॥ శు ॥ హిమవారిమిశ్రిత । విమలశీతలజల । మమరఁదెచ్చియిచ్చెద ॥ సద్గురురాయ ॥ శు ॥ కారణాచార్యతా । ళ్లూరినారాయణ । చారుహృత్సంచారణ ॥ సద్గురురాయ ॥ శు ॥ దురితనివారణ । పరమపావనమైల । వరపువేంకటశివాఖ్య ॥ సద్గురురాయ ॥ శుద్ధాచమనమాచరా ॥

శోభనపాట ॥ సౌరాష్ట్రరాగము ॥ ఆదితాళము.

వైభోగంబుగవరుసదీరి । వేభంగులగురువీరునకు । శోభనమనుచుమదేభగామినులు । ప్రాభవమతితోఁ । బాడగను ॥ శుభశోభనే । శోభనమే ॥ స్వానుభవముచేసజ్జనులు । మానసపంకజమధ్యమున । మానితముగవేమఱుఁగనుఁగొనుచును । నానందించేయాత్మునకు ॥ శుభశో ॥ వ్యష్టిసమష్టిమయంబైన । దృష్టప్రపంచము । దీసివేసి । స్పష్టముగాభక్తాభీష్టములొసఁగెటి । యష్టాంగయోగాభ్యాసునకు ॥ శుభశో ॥ ధారుణీతలమునఁదాళ్లూరి । నారాయణాఖ్యుఁడనారతము । ధీరుఁడైకొలిచినదివ్యజ్ఞానము । సారెఁకుదెలిపినసరసునకు ॥ శుభశో ॥ క్షురతత్వమునకుసాక్షియగు । పురుషునకునుదాఁబరుఁడగుచుఁ । బురుషోత్తముఁడనఁబఱఁగినశ్రీమైల । వరవేంకటశివగురునకును ॥ శుభశోభనే ॥

తలఁటుపాట ॥ శంకరాభరణరాగము ॥ ఆదితాళము.

శ్రీగురువరధీరా । ఆగమసువిచార । యోగానందవిహారా । రాగద్వేషవిదూర ॥ శ్రీగురు । పంచవన్నెలుగల । పళ్లెరంబులుబూని । పంచశక్తులుహారతి । పాటలువాడుచుండ ॥ శ్రీగు ॥ ప్రేమతోస

హసాగ్రి । పీఠముపైముక్తి । కామినితోడఁగూడి । కడఁగికూర్చుండఁజే
సి ॥ శ్రీగు ॥ ఆనందామృతసార । ఘనమైనసంపెగనూనె । మానసాం
గనచేతఁ । బూనితలయంటఁగను ॥ శ్రీగు ॥ భేరీమృదంగవేణు । వీ
ణాదిదశవిధ । చారువాయిద్యముల । పారముగమ్రోయుచుండ ॥ శ్రీగు ॥
అఖిలలోకములవా । రాద్వారమందుఁజేరి । సుఖముగనివసించి । చూ
చుచుండిరిప్రీతి ॥ శ్రీగు ॥ మాభాగ్యవశమున । శోభాయమానముగ ।
నీభక్తవరదుని । నిపుడువీక్షింపఁగలిగె ॥ శ్రీగు ॥ ఇంద్రియలోలుల
కు । నీమహానియ్యుని । సంపర్శనముజేయ । సాధ్యముగాదుసుమ్మి ॥ శ్రీగు ॥
చిత్తచపలతచేత । నుత్తజగమునునమ్మి । మత్తులగువారికీ । మహాను
దెలియఁగరాదు ॥ శ్రీగు ॥ ధరనునారాయణాఖ్య । దాసమనోంబు
జ । వరవాసశ్రీశైల । వరపువేంకటశివ ॥ శ్రీగు ॥

నలుగుపాట ॥ ఆదితాళము.

నలుగిడరమ్మగురు । నాథునకింతులార ॥ నలు ॥ నలువందభ
క్తహృదయ । నలినసంచారునకు ॥ నలు ॥ గంగలుగల్లుమధ్య । రం
గమధ్యమునందు । బంగారుపీఠమునఁ । బఱఁగఁగూర్చున్నగురున
కు ॥ నలు ॥ జననమరణములను । ననమానమేమిలేక । మనుచుని
శ్చింతుడైన । మహానియ్యుఁడున్నచోట ॥ నలు ॥ క్షుత్పిపాసలులేక ।
సత్పాత్రమైనట్టి । చిత్పథమునవెలయు । సత్పురుషునకిపుడు ॥ నలు ॥
శోకమోహములను । జోలిమేమియులేక । ఆకాశాతీతుఁడైన । యాం
త్యుఁడుండినచోట । నలు ॥ పాయకఁదాళ్లూరినా । రాయణశర్మ
హృదయ । తోయజవాసుఁడైన । మాయాతీతునకిపుడు ॥ నలు ॥ పం
కజపాణులార । పొంకముమీఱఁగని । శంకులైనైలవరపు । వేంకట
శివగురునకు ॥ నలుగిడ ॥

స్నానము ॥ ఆదితాళము.

స్నానమాచరింపుగురువరా । సద్భక్తవరద ॥ స్నాన ॥ స్నా
నమాచరింపవేక్రు । పావనిమహానుభావ । జ్ఞానరూపకించిదుష్ణ । నై

నశుద్ధజలములిత్తు ॥ స్నాన ॥ శ్రీకరంబుగనుశరావతీ । నేత్రావతీ త్రి। లోకపూజ్యమగుసరస్వతీ । ప్రాకటముగసింధుగంగా । బ్రహ్మపుత్రనర్మదాపి । నాకనీముఖనదులజలము । మీకువేడ్కఁదెచ్చియిత్తు ॥ స్నాన ॥ భాసురచిద్విలాససుందరా । నారాయణాఖ్య । దాసహృదయజలజమందిరా । వాశిమీఱఁగనుమైల । వరపువేంకటశివాఖ్య । దేశికేంద్రవుణ్యనముల । తీర్థములనుదెచ్చియిత్తు ॥ స్నాన॥

పంచామృతస్నానము ॥ భైరవిరాగము ॥ రూపకతాళము.

పంచామృతస్నానముగా । వించరెగురుదేవునకును ॥ బంచా ॥ పంచాశద్వర్ణరూప । ప్రణవాత్మునకునుముదమునఁ ॥ బంచా ॥ శ్రీరంజిలఁగపిలధేను । క్షీరంబులుదధిఘృతమును । సారంబుగమధుశర్కర । నారికేళఫలసారము । వేరుగఁగొనిమైలవరపు । వేంకటశివగురువగునకు । నారాయణదాసాత్మపి । హారునకును । గడుముదమునఁ ॥ బంచామృత ॥

వస్త్రము ॥ శంకరాభరణరాగము ॥ ఆదితాళము.

జరీవస్త్రములుధరింపవే । గురు । వర్ణ్యాకలుషముహరింపవే । నిరంతరముశుభ । కరంబుగనువే । గిరంజెశిష్యుని । కరంబులిచ్చిన ॥ జరీ ॥ మనంబురంజిలఘనంబుగ । నను । దినంబుగడుశోభనంబుగ । నవర్ఘ్యమగుపట్టు । బనారసులుకాం । చనాభమగుశా । లునామలునుసుంచి ॥ జరీ ॥ కరంబుశోభాకరంబులై । శ్రీకరంబులైమృదుకరంబులై । పటంగుపీతాం । బరఁబులతిభా । సురంబులగును । త్తరీయములువెండి ॥ జరీ ॥ నవీనమైనవిధ్యవంబుగ । ని । త్తువేగఁగొనువైభవంబుగ । ప్రవీణవరనా । రాయణకవిస్ఫూ । ర్నివేశవేంకట। శివాఖ్యగురువర ॥ జరీ ॥

జన్నిదము ॥ సౌరాష్ట్రరాగము ॥ చాపుతాళము.

యజ్ఞోపవీతమర్పింతు । నేను । యజ్ఞస్వరూపుశేవింతు ॥యజ్ఞ॥ కనకసూత్రాన్వితంబైన । ము । క్తాఫలవిరాజితంబైన ॥ యజ్ఞ ॥ నారా

యణాఖ్యదాసునకు । మోతు । మారూఢినిచ్చు పరశునకు ॥ యు ॥ వ
రపరబ్రహ్మరూపునకు । మైల । వరపువేంకటశివాఖ్యునకు ॥ యు ॥

గంధము ॥ ముఖారిరాగము ॥ ఆదితాళము.

పరిమళగంధములందరమ్మా । సద్గురుమూర్తికిఁ ॥ బరిమళ ॥ సు
రుచిరముగుక । చ్చూరంబులుగ । ర్పూరమునగస్తురి । సరగునఁగల్పి
న ॥ పరిమళ ॥ ఘనసారమునువేయరమ్మా ॥ హిమవారివోసి । ఘ
నముగఁగలియఁజేయరమ్మా । మణిమయచషకం । బునఁగొనితెచ్చి
యు । నమువుగఘుమఘుమ । యనివాసింపఁగఁ ॥ బరిమళ ॥ నవమో
హనాంగులారరారే । బహువిధసురభి । ద్రవములన్నియుఁగూర్చుకో
రే । భువినారాయణ । కవినుతుడఁగుమై । లవరపువేంకట । శివగురువ
రునకుఁ ॥ బరిమళ ॥

నాదనామక్రియరాగము ॥ ఆదితాళము.

చల్లరమ్మ । సద్గురునిపైనఁ ॥ జల్ల ॥ చల్లరమ్మమీ । రెల్లఁగూడి
శో । భిల్లసుగంధము । చల్లఁగ వేఁనఁ ॥ జల్ల ॥ ఉల్లంబులురం । జిల్లఁ
దెల్లఁగను । మల్లెమొల్లలును । గొల్లగఁబైన ॥ జల్ల ॥ రాజితముగపిర
జాజిరసముజ । వ్వాజియుతలు । లాజలుపైనఁ ॥ జల్ల ॥ ధరనా
రాయణ । దాసనుతునిపై । నిరతంబునుబ । న్నీరునుదెచ్చి ॥ చల్ల ॥ప్ర
విమలముగమై । లవరపువేంకట । శివగురుపైగం । ధవడిగొల్లగఁ ॥జల్ల॥

పూజ ॥ నాదనామక్రియరాగము ॥ ఆదితాళము.

పూజసేయరే । సద్గురునిపాద ॥ పూజ । రాజవదనలల । రా
జయోగిపద । రాజీవములను । రాజీవములను ॥ బూజ ॥ చెంతఁజేరరే ।
వేవేగమున । బంతిదీరరె । ఇంతులారమీ । రెంతోముదమున । వింత
లైనచే । మంతిపువ్వులఁ ॥ బూజ । దీక్షబూనరే । మదిలోననితరా ।
పేక్షమానరే । అక్షులుమిడిచియు । నక్షయముగధవ । ళాక్షతలను

బ్ర । త్యక్షముగాఁగొని ॥ పూజ ॥ కోరిచూడరే । దాసోహమనివే । మాఱువేడరే । పారిజాతమం । దారకుందజం । బీరతులసిమాలూ రదళములఁ ॥ బూజ ॥ పెంటనిల్వరే । యరివర్గములనా । లింటిఁగొ ల్వరే । అంటినభక్తిని । యుతిముదమునవా । ల్గంటులారగో । రంట పువ్వులఁ ॥ బూజ ॥ డాసిప్రీతిగ । నారాయణాఖ్య । దాసురీతిగ । దాసానంబులు । గోసతెచ్చిమది । వేసటనొందక । వేంకటశివగు రు ॥ పూజ ।

ఆభరణములు ॥ శంకరాభరణరాగము ॥ అటతాళము.

ధరియింపరమ్మ । భూషణములు ॥ ధరి ॥ ధరియింపరమ్మ సుం । దరులారగురునకు । నిరుపమసకలా । భరణములెల్లను ॥ ధరి ॥ అంగుళములను । మణిమయమైన । యుంగరములను । అంగనామ ణులార । యతివేగగళమున । రంగమీఱఁగనవ । రత్నాలసరము లు ॥ ధరి ॥ సుందరముగను । బంగరుకటి । సూత్రమింపుగను । డెం దములంమనా । నందమునొందుచుఁ । గుందనంపుబాజి । బందులు భుజముల ॥ ధరి ॥ ధరణిఁదాల్గూరి । నారాయణ । దాసునిఁజేరి । క రుణతోఁదత్వమా । ర్గముఁదెల్పుశ్రీమైల । వరవువేంకటశివ । గురున కుఁదోడవులు ॥ ధరియింపరమ్మ ॥

ధూపము ॥ రేగుప్తిరాగము॥ ఆదితాళము.

ధూపమాఘ్రాపయామి । శ్రీగురుదేవ ॥ ధూప ॥ ధూపమా ఘ్రాపయామి । పాపనాశనసంత । తాపదుద్ధారకోప । తాపహార ణనీకు ॥ ధూప ॥ సర్వజగద్విలక్షణా । మహానుభావ । సతతకటాక్ష వీక్షణా । సర్వేశసర్వాధార । సర్వాంతర్యామిరూప । నిర్వాణఫల దయ ॥.నిర్వాచ్యకాలాగరు ॥ ధూప ॥ ధీసాక్షిస్వప్రకాశ । నారా యణ । దాసమనోనివేశ । వాసిమీఱఁగమైల । వరవువేంకటశివ। దేశి కవర్యమంచి । వాసనగలసాంబ్రాణి ॥ ధూప ॥

దీపము ॥ ఆనందభైరవి రాగము ॥ అటతాళము.

సందర్శయామి । దీ । పందర్శయామి । పొందుగ సద్గురు । మూర్తి నమామి ॥ సంద ॥ అజ్ఞానతిమిరాప । హరసుధీరా । సుజ్ఞాన దీపసం । శోభితాకార ॥ సంద ॥ కుందనంపు మేలికుందములయందు । కుందరదనలుంచు । కొని తెచ్చిరిందు ॥ సం ॥ ప్రాపిత సాజ్యంత్రివర్తియుత దీప । మాపోజ్యోతిరూపయపహృతపాప ॥ సంద ॥ నారాయణాఖ్యహృత్సారసవాస । ధీరవ్యస్థానసుస్థితచిద్విలాస ॥ సంద ॥ కరుణాసుధానిధే కారణాచార్య । స్థిరధైర్య వేంకటశివగురువర్య ॥ సంద ॥

నైవేద్యము ॥ శుద్ధసావేరి రాగము ॥ రూపకతాళము.

ఆరగించవయ్యా । మన । సారగ గురువర్యా । యిపు ॥ డార ॥ ఆరగించవయ్య భక్తు । లారసికొని తెచ్చినట్టి । సారవస్తువులను సారె । సారెకు సంపూర్ణముగను ॥ నార ॥ సాదరంబుదోప । రా । జోదనమ్ము నసూప । మాదటంగదుంబ్రీతిగం గద । వీదళములయందునుని చి । వేదరూప మోదమునని । వేదనగొని తెచ్చితినదో ॥ యార ॥ కూరలూరుబిండ్లు । మంచి । దోరయరటిపండ్లు । జారుంబింఛిమిరియంబులు । జాలినన్నియప్పడములు । గోరినన్నివడియములల్ల । పూరగాయలతిముదమున ॥ నార ॥ మఱుగు బూలువడలు । ని । ద్దినలునూగుజడలు । ఘనముగ హెూళిగజిలేబి । ఖజ్జకాయలతిరసములు । దనరంచేనె తెరలు దినా । దినుసుపిండి వంటలివిగో ॥ యార ॥ మధురద్రాక్షగెలలుం । గడు । మంచిపనసతొళలు । మధుశర్కరముద్గసుధా । దధిగోఘృతములున నేక । విధఫలములు మైలవరపు । వేంకటశివగురువరేణ్య ॥ యార ॥ తీయని నానబాలు । మి । తాయి చెఱకుపాలు । హాయిగంగలమాన్నములును । పాయసములు మెంతి పెరుగు । శ్రీయుతముగం దాల్గూరినా । రాయణదాసొసంగెనివిగో ॥ యార ॥

బువ్వపుబంతిపాట ॥ ఆదితాళము.

విజ్ఞానంబనుహరిబువ్వమునకు । విందుజేసెదము । బుధులకు ॥ విందు ॥ ప్రజ్ఞావంతులకందఱికినిదిపరమసులభము ॥విజ్ఞా॥ మానసతీర్థము । లోనతివేగమె । స్నానముచేయండి ॥ శిరస్స్నానము ॥ ఆణవకార్మిక । మాయామలముల । నరసికడగండి ॥ విజ్ఞా ॥ సాధనచతుష్టయమనుఘనవ । స్త్రములుధరించండి ॥ వస్త్రములు ॥ బోధవైరాగ్యోపరతులనుభూతిఁబూయండి ॥ విజ్ఞా ॥ రజతతామ్రమువి । నీలకాంచన । రాజితపీఠముల । వి ॥ రాజిత ॥ నిజహృదయంబులునిండియలరఁగనునివసించుఁడువేగ ॥ విజ్ఞా ॥ బ్రహ్మవేత్తలందఱుఁగూడుకబలసియొకబంతి । కడు ॥ బలసి ॥ బ్రహ్మవిద్వరుఁలెల్లరుగూడుకఁబ్రబలుఁడొకబంతి ॥ విజ్ఞా ॥ బ్రహ్మవిద్వర్యులువేడుకతోఁ । బరఁగుఁడొకబంతి । మీరు ॥ పరగు ॥ బ్రహ్మవిద్వరిష్ఠులుముదమునఁబాయకనొకబంతి ॥ విజ్ఞా ॥ రక్తితోజీవన్ముక్తినిగోరె । భక్తులొకబంతి ॥ గురుభక్తులొకబంతి ॥ యుక్తాయుక్తములెఱిఁగిన యోగా సక్తులొకబంతి ॥ విజ్ఞా ॥ అరయఁగశ్రీరాజయోగంబనుశా । ల్యన్నమెవడ్డించీ । శాల్యన్నమె ॥ పరమసాత్వికమనుఛాయబేడల । పప్పుజేయించి ॥విజ్ఞా॥ సారెకుశమముఖషట్కంబనియెటి।కూరలుసేయించీ ॥మంచికూర॥ఆరూఢంబనుగలమాన్నంబులు। నతివేడ్కతోనునిచి ॥ విజ్ఞా॥ నిత్యానిత్యవివేకంబనునావు । నెయ్యివడ్డించి ॥ ఆవునెయ్యి ॥ నిత్యానందంబనుపరమాన్నము । నేర్పుతోవడ్డించి ॥ విజ్ఞా ॥ పంచకోశాతీతంబనుపంచ । భక్ష్యములమరించి ॥ పంచభక్ష్య ॥ సంచితాగామికర్మలుదీరె । చారుబెట్టించి ॥ విజ్ఞా ॥ త్రివిధదీక్షలుదీరినవారు । దీవ్రంబునరండు॥కడుఁదీవ్రం।త్రివిధప్రసాదంబులునాకలి।దీఱఁదినిపోండు ॥విజ్ఞా॥ భాసురముగఁదాళ్లూరినారాయణ । దాసనిర్మితము ॥హరిదాసా॥ వాసిగస్వప్రకాశాలోకా । భ్యాససాధకము ॥ విజ్ఞా ॥ గురుతరముగవై

లవరవేంకటశివ । గురువరబోధితము ॥ శివగురు ॥ నిరతిశయానంద విభాసితము । నిర్వాణప్రదము ॥ విజ్ఞానంబను ॥

బువ్వముబంతిపాట ॥ అటతాళము.

శ్రీసదాశివబ్రహ్మబువ్వము । ఓసఖీమానసోల్లాసకరము । భాసురచిద్విలాసవైభవము । భక్తిజ్ఞానవైరాగ్యసత్ప్రదము ॥ శ్రీస ॥ ఒనరతనుత్రయనగరిపైన । ఘనసుషుమ్నాంతఃపురములోనఁ । గనకమయకంజసింహాసనమునఁ । దనరమోక్షాంగనఁగూడియున్న ॥ శ్రీస ॥ పంచవర్ణములపీఠములఁ।బంచశక్తులతోడఁగూడి । పంచకర్తలుపట్టుగాలుదీరి । మించిదశవాద్యములనువినుఁడీ ॥ శ్రీస ॥ పదునాల్గులోకములవారు । పాదాదిమస్తకమువరకు । సదమలచిత్తులైమీరు । ముదమునఁగూర్చుండఁగవలయు ॥ శ్రీస ॥ సుదతిచతుర్వేదములనెడు । కదళీపత్రములెపఱపించి । సదమలోపనిషత్సారమెల్లఁ । బదిలముగహేమపాత్రలనింపి ॥ శ్రీస ॥ నిరుపమమహావాక్యార్థమనెడు । సరసరాజాన్నమెవడ్డించి । గురుకటాక్షమనేసూపమును । బరితృప్తిగనాపైనునిచినారు ॥ శ్రీస ॥ పరమగోప్యమనేయాజ్యమును । భక్తహృత్పుటములఁబదిలపఱచి । సురుచిరాపరోక్షజ్ఞానమనెడు । పరమాన్నముదొప్పలనునిచినారు ॥శ్రీస॥ వర్ణత్రయమనేశాకములు । వరుసగఁదెచ్చివడ్డించినారు । వర్ణాతీతమనేయప్పడము । వడియములువేచివడ్డించినారు ॥ శ్రీస ॥ నవవిధములైనభక్తులనెడు । నవకాయపిండివంటలుగలవు । త్రివిధలక్ష్యములనెడుపచ్చడులు। సవినయభావమనెడుచోష్యమును ॥ శ్రీస ॥ సత్యజ్ఞానానందమయాత్మ । ప్రత్యక్షమనెడుప్రసాదమును । సత్యముగనారగించిమోదించి । నిత్యానందమునొందఁగఁగలము ॥ శ్రీస ॥ అందరానట్టిబువ్వమిదియేను । నాలస్యమేటికిఁకరండు। ఇంతముభుజియించినవారికి । నిఁకనుక్షుత్పిపాసలెక్కడివి ॥ శ్రీస॥ అందరికినిదియబ్బునెతలంప । ననుభవించినవారికిఁగాక । సందేహవాదు

లకనేక । జన్మములకైననుదారకునే ॥ శ్రీస ॥ కులమురూపముగోత్ర
సూత్రము । స్థలవిమర్శముచేయఁగవలదు ।వలసినవారలెల్లనురండు ।
వల్లనివారలావలఁబొండు ॥ శ్రీస ॥ ధారుణినారాయణాఖ్య । దాసు
నిరీతినేవేళఁ ।గారణాచార్యుఁనిగొలిచిన।వారికిఁజేరువయగును ॥శ్రీస॥
శంకలేకమైలవరపు । వేంకటశివయోగిపాద । పంకజములర్చించిన ।
కింకరులకుసుకరమగును ॥ శ్రీసదాశివబ్రహ్మబువ్వము ॥

మంచినీరు ॥ రేగుప్తి రాగము ॥ ఆదితాళము.

నీరుగ్రోలుగురువర్యా । భవ । నీరధిఁదేలుచునయ్యా । నీరు
గ్రోలుమహా । నియ్యరూపజం। బీరసారఘన।సారయుతంబగు ॥ నీరు॥
సకలనదులకునుదిరిగి । యందు । నకలంకోదకమెఱఁగి । ప్రకటితంబు
గను । భక్తజనులుద । ప్పకఁగొనితెచ్చిన । పరిశుద్ధంబగు ॥ నీరు ॥వి
విధపాత్రములసర్మ । లాం । బువులనారాయణశర్మ । అవిరళముగమీ।
కర్పించెనుమై । లవరపువేంకట । శివదేశికవర ॥ నీరు ॥

తాంబూలము ॥ బిలాహరి రాగము ॥ అటతాళము.

విడెముసేయుమువేగ । విమలయోగీంద్ర ।కడఁగిభక్తులఁబ్రో
వుకారుణ్యసాంద్ర ॥ విడెము ॥ పచ్చిపోకలుదెచ్చి । పసలవత్తించి ।
పచ్చకప్రముఁబూసి । షడఁతులిచ్చెదరు ॥విడె॥ శ్రీకరంబుగఁబండు।
టాకులుదెచ్చి । జోకతోముత్యంపుచూర్ణముంచితిమి ॥ విడె ॥ ఏలకు
లునులవంగాలుజాపత్రి । మేలుజాజికాయమీకునర్పింతు ॥విడె॥ ప్రా
కటముగనునా।రాయణశర్మ।ఆకుమడుపులుగట్టి।మీకునర్పించు ॥విడె॥
సరగవేంకటశివగురువర్యయివిగో । స్థిరముగపెండిప । ళ్లెరముంచం
చితిమి ॥ విడె ॥

నీరాజనము ॥ మధ్యమావతి రాగము ॥ అటతాళము.

నీరాజనమివ్వ । వేరాజవదన । మారాజయోగికిమార్తికరద
నా ॥ నీరా ॥ మండలత్రయమున । మంగళముగను । నిండిశోభిల్లున

ఖండునకిఁకను ॥ నీరా ॥ రంగుగఁద్రివేణీసంగమునందు। బొంగిపెలుం గున । సంగునకిందు ॥ నీరా ॥ సూరివరునకాపో ।జ్యోతిరూపునకు। నారాయణాభిధా । నారాధనునకు ॥ నీరా ॥ సరసీరుహాక్షివే । సరకశ్రీమైల । వరపువేంకటశివ । గురునకీవేళ ॥ నీరా ॥

కర్పూరహారతి ॥ శంకరాభరణము ॥ ఆదితాళము.

కర్పూరహారతు । లర్పించరేమీరు । కర్పూర ॥ కర్పూరగంధులార । నేర్పుతోగురునకుఁ ॥ గర్పూ ॥ మొనసిత్రికూటపీఠ । మునఁగ్రియాశక్తితోడ । నెనసిచరించుకంజాసనరూపునకునిపుడు ॥ కర్పూ ॥ ఆటపీఠమునందు । ధాటిగజ్ఞానశక్తి । తోటివసించుహేమ।శాటిరూపునకిపుడు ॥ గర్పూ ॥ చెలఁగిగొల్లాటపీఠ । స్థళమునవిచ్ఛాశక్తి । నలరుచుఁగూడియున్న । యారుద్రరూపునకుఁ ॥ గర్పూ ॥ కలయాడపీఠమందుఁ । గడువేడ్కనాదిశక్తి । నెలమినిగలిసియున్న । యీశ్వరరూపునకుఁ ॥ గర్పూ ॥ రక్తిమీఱఁగబ్రహ్మ । రంధ్రపీఠమునఁబరా। శక్తినిగూడియున్న । సదాశివునకును ॥ గర్పూ ॥ నారాయణాఖ్యదాసా । ధారుఁడైనిత్యనిర్వి । కారుఁడైయున్నశ్రీవేం । కటశివగురునకుఁ ॥ గర్పూరహారతు ॥

పంచహారతి ॥ బిలాహురిరాగము ॥ అటతాళము.

పంచహారతియివ్వరె । గురువరునకుఁ ॥ బంచ ॥ పంచహారతియివ్వరే। యంచితంబుగఁగొల్వరె । పంచవింశతితత్త్వరూపప్ర । పంచసాక్షికిఁజంచలాంగులు ॥ పంచ ॥ పమగురినదలించరే। అయిదుగురిని । గుదియించిబంధించరే గదిమినలుగురినొంచరే । పిదపనాల్గురిఁద్రుంచరే । పదమలంబుగఁగదిసిలోపల ।వెదకిపరునకుముదముమీఱఁగఁ ॥ బంచ ॥ మండలములమించరే । ఆలోనహృ । త్పుండరీకముఁగాంచరే । ఖండమతములడంచరే । కుండలినిబెకలించరే । పండువె

న్నెలబైటవెలుఁగున । ఖండమూర్తికినిండువేడ్కను ॥ బంచ ॥ తెలిచెంతకుఁజేర్చనే । నారాయణ । కవికోర్కెలీడేర్చనే । భవభయంబులుదీర్చనే । బంధములుపరిమార్చనే । ఘనశ్రీశైలవరవేంకట । శివగురూత్తమునకుధ్రువంబుగఁ ॥ బంచహారతి ॥

కుంభహారతి ॥ మధ్యమావతి రాగము ॥ ఆదితాళము.

కుంభహారతియివ్వరమ్మ । సద్గురునకుఁ ॥కుంభ॥ కుంభహారతిని । గురునకునివ్వరే।యంభోజాక్షులు।సంభ్రమమొందుచుఁ॥కుంభ॥ అమవసయనెడుచూపువిడిచి । వేవేగమునఁబా । డ్యమియనుచూపుఁబోవనడఁచి । విమలంబగుపు । న్నమిచూపునల । క్ష్యముఁజేర్చినగో । చరుఁడగుపరునకుఁ ॥కుంభ॥ కుడియెడమలనున్నయట్టి । నాడులరెంటి । విడిచినడినాళమునుబట్టి । కడువడిపైకె । క్కెడువారికిఁగ । న్వడుచువెలుఁగున । త్పరమాత్మునకును ।కుంభ॥ మనసుమారుతమొకటిజేసి । తాళ్లూరినారా । యణదాసుభావిభవములరోసి । ఘనముగఁదనహృ । ద్వనజాతంబునఁ । గనుచుండెడువేం । కటశివగురునకుఁ ॥ కుంభహారతి ॥

మంగళహారతి ॥ ముఖారిరాగము ॥ జంపెతాళము.

శ్రీరాజయోగికినిశిద్ధాగ్రగణ్యునకు। చిన్మయాకారునకచింత్యునకును । సారవిజ్ఞాననిశ్చలయోగిచంద్రునకు । నారూఢకారణాచార్యునకును ॥ జయమంగళంసదాశుభమంగళం ॥ శివరూపమునమేరుశిఖరిపైవిహారించి । శేవకాళినిగూడిశుభములొసఁగి । శివశివాయనుశిష్యసంఘంబునకునెల్ల ॥ శివజీవులనుదెల్పుశిష్టమతికి ॥జయ॥ ఈడుజోడునులేకయేకమైవెల్గుచును । మూడుమూర్తులకెల్లమూలమగుచు । వాడుఁవీడఁనుభేదవాదంబు లెఱుగకనుఁ । గూఢుఁడై విలసిల్లుగురుమూర్తికి ॥ జయ ॥ కరుణించితాళ్లూరికృష్ణదాసుకుఁదత్వ । మరలేకబోధిం

చియాత్మఁ దెలిపి । నిరతయోగానందనిష్ఠఁ డగుశ్రీమైల । వరపు వేంకటశివగురువరునకు ॥ జయమంగళంనిత్యశుభమంగళం ॥

మంగళహారతి ॥ సురటరాగము॥ అటతాళము.

అంగత్రయమునుదో । లంగితుర్యమున నే। కాంగియై నిలిచి మో । క్షాంగనతో । రంగుమీఱంగ నాలింగన మొనరించి ।పొంగుచుండుగురు। పుంగవునకును ॥ మంగళంమంగళం ॥ సద్గురునకుమంగళం ॥ ఒంటిగనిలిచి తెండింటిని గెలిచిమూ । డింటినిమీటినాల్గింటిదాటి । జంటనైదింటి నాఱింటి నిగెంటియు । మింటిపైఁదోచు ముక్కంటి రూపునకు ॥మంగ॥ పలుకులకునుబోకఁబలుకులు తాఁగాకఁ। బలుకులతోఁజెరిపలికించుచుఁ।బలుకులకందకఁబలుకిరిఁజెందకఁ।బలుకునిలిచినచోటఁజెలఁగుగురునకు ॥ మంగ॥ ఫాలముననుభూతిమేలుగఁబూసిక । పాలముననుగరముచాలనునిచి । పాలాయముగఁబ్రకృతిజోలిఁబాపిమూల। మోలిఁదెల్పినకరుణాలవాలునకు ॥ మంగ॥ ఆపదలనుబొడజూపనీకఁదోలి । తాపత్రయంబులరూపుమాపి। యాపోజ్యోతినిదనలోపలఁజూపిన । యాపరమాత్మస్వరూపునకిదిగో ॥మంగ॥ సురుచిరముగనిజచరణాబ్జ శేవాత । త్వరులైనశిష్యనికరములకు ।గురుతరముగబోధగరపుచుండుమైల । వరపు వేంకటశివగురువరునకును ॥ మంగళం ॥

మంత్రపుష్పము ॥ ఆనందభైరవి రాగము ॥ అటతాళము.

మంత్రపుష్పమునుగైకొమ్ము । బహు । మాన్యచరితసంతతమ్ము ॥ మంత్రపుష్పమునుస । మ్మతమునఁగైకొమ్ము । మంత్రస్వరూపని ।.ర్మలదీపసౌవర్ణ॥ మంత్ర ॥ మొల్లవిరులుజాజిపూలు ।నాగ। మల్లెలుదోణిపుష్పాలు । మల్లెకుసుమములు । మాలూరదళములు । దెల్లగన్నేరులు । దెచ్చియిచ్చెదదివ్య ॥ మంత్ర ॥ కూరిమితోఁబూజజేసు ।.తా । ళ్లూరినారాయణదాసు । ఆరూఢిగనుమీకు । నర్పించెభక్తిచేఁ।గారణాచార్యవేం।కటశివగురువర్యా ॥ మంత్ర ॥

ధ్యానము ॥ తోడిరాగము ॥ ఆదితాళము.

నమోనమోగురునాథా । ఓన్నమోనమో వేదశోధ॥నమోన మోగురు । నాథదయాకర। ప్రమోదమానస । పావనచరిత ॥నమో॥ ఇతరముశరణములేమ । న । మ్మితినిమిమ్మునింకమీఁదు । సతతము నాదు । షన్నుతమునుదోషిచియు । నతులితముగస । ద్గతినియొసఁగవె ॥ నమో ॥ కామేంద్రియపరిహారా । నా । రాయణదాసాధారా । శ్రీయుత వేంకట । శివదేశికవర । ధీయతీతఘన । దృక్స్వరూపకా ॥ నమో ॥

పునఃపూజ ॥ ఆనందభైరవిరాగము ॥ ఆదితాళము.

సకలోపచారములు, సలుపరమ్మ । మీ । రిఁకనుసద్గురునినుతి, యించరమ్మ ॥ సక ॥ పడఁతులారాఛత్రమును, బట్టరమ్మ ॥ మీరు ॥వి డువకఁజామరముఁబూని,విసరరమ్మ ॥సక॥ ప్రతిలేనిసంగీతమును, బాడరమ్మ॥మీరు॥అతిమోదమునన్నృత్యం, బాడరమ్మ ॥సక॥ తులలేనిపాము కలుదెచ్చి, తొడుగరమ్మ । రత్న । ఖిలసితాందోళికముపైనె, క్రిఁ౦ చరమ్మ ॥సక॥ వేవేగవేంకటశివగురు,వేడరమ్మ । రాజ । దేవోపచార ములెల్లఁ,దీర్పరమ్మ ॥ సక ॥ నారాయణదాసురీతిఁ, జేరరమ్మ ॥మీరు॥ శ్రీరంజిల్లఁబాదశేవఁ,జేయరమ్మ ॥సకలోప॥

---

# ఏకాంతశేవ.

---:0:---

పావపు ॥ కాంభోజిరాగము ॥ ఆదితాళము.

పవ్వళించఁగదయ్యగురువర్యా । యోగశయనమునఁ ॥ బవ్వ॥ కొప్పునసుబై । కొన్నవృత్తులఁ ।గప్పుకొనిరా।నిప్పకనువేగఁ॥బవ్వ॥ చాలువేయిస్తంభములన । ద్దాలమంచిమేడలోను । మేలిబంగరుగొలుసులతో పేరిలుచుండిన । లీలస్ఫటికవర్ణహంస । తూలికాతల్పముపైనని

